# కర్మయోగము

మనము ప్రతిరోజు ఉదయం నిద్ర మేల్కొన్నది మొదలు తిరిగి రాత్రి నిద్రకు ఉపక్రమించువరకు ఎన్నో పనులను నిర్విరామంగా చేస్తూనే ఉంటాము. స్నానం చేయడం, భోజనం చేయడం, విద్యాభ్యాసం, ఉద్యోగ బాధ్యతలను నిర్వర్తించడం, నిద్రించడం యిలా చిన్నా పెద్ద తారతమ్యం లేకుండా ప్రతి ఒక్కరు పనిలో నిమగ్నమై ఉంటామన్నది స్పష్టం.

ఎందుకు మనం పని చేస్తాం? ధన సంపాదన కోసమో, ఆహారం కోసమో లేక మరొక వస్తువును పొందడం కోసమో కావచ్చు. దేనికొరకు మనం పని చేసినప్పటికీ దాని వెనుక ఉన్న అంతరార్థం మాత్రం సుఖ, సంతోషాలను పొందడమే. ఆనందాన్ని పొందుట కొరకే. సృష్టిలోని ప్రతి జీవికి యిది సహజం.

మనం చేయు పనినే "కర్మ" అని వ్యవహరిస్తాము.

కర్మలను ప్రధానంగా రెండు రకములుగా విభజించవచ్చు. 1. సకామ కర్మ, 2. నిష్కామ కర్మ



**సకామ కర్మ :**

ఫలమును ఆశించి చేయు కర్మలను "సకామ కర్మ" లని వ్యవహరిస్తారు. అనగా వైదిక కర్మలు లేదా లౌకిక కర్మల ద్వారా ప్రాపంచిక సుఖాలనాశించి చేయు కర్మలు.

ఉదాహరణకు స్వర్గలోక ప్రాప్తిని ఆశించి చేసే "జ్యోతిష్టోమ యాగం" మరియు పుత్ర ప్రాప్తి కొరకు చేయు "పుత్రకామేష్టి యాగం" మొదలగునవి.

అయితే యీ సకామ కర్మల వలన కలుగు ఫలం అల్పం, అనిత్యం. ఇవి శాశ్వత సుఖాన్ని యివ్వలేవు.

**నిష్కామ కర్మ :**

ఎటువంటి ప్రాపంచిక ఫలాన్ని ఆశించకుండా చేయు కర్మలు. శాస్త్రం చేత మానవుని హితం కొరకు నిర్దేశింపబడిన కర్మలు అనగా విహిత కర్మలు. వీటినే "నిత్య నైమిత్తిక కర్మలు" అని కూడా అంటారు.

ఉదాహరణకు పంచమహా యజ్ఞములను ఆచరించుట. నిష్కామంగా చేయు ఎటువంటి కర్మ అయిన అది స్వల్పంగానైనా ఆచరించగలిగిన యెడల అది నిన్ను జన్మమృత్యు భయముల నుండి కాపాడుతుంది.



**నేహాభిక్రమనాశోస్తి ప్రత్యవాయో న విద్యతే**
**స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్**
(భ.గీ. 2.40)

సకామకర్మల నుండి నిష్కామ కర్మలకు మరలడం మానవధ్యేయం కావాలి.

ఎన్ని కర్మలు మనం ఆచరించినప్పటికీ శాశ్వత సుఖాన్నిచ్చు మోక్షమును పొందుటయే మన లక్ష్యంగా ఉండాలి. అయితే దీనికి విరుద్ధంగా సుఖ దుఃఖ మిశ్రిత జీవితమే మనకు లభించుచున్నది. జీవితంలో ప్రతి సుఖం వెనుక కష్టం పొంచి ఉంటున్నది, సంతోషంతో పాటుగా దుఃఖమూ కలుగుచున్నది. ఏమిటి దీనికి కారణం? "మన పూర్వ జన్మ పుణ్య పాపకర్మలే" ఈ జన్మలో సుఖ దుఃఖాల రూపంలో మనకు తటస్థించుచున్నవి.

మనం చేసిన కర్మలే మన జీవితాన్ని దిక్సూచిలా నిర్దేశిస్తుంటాయి అన్నది సుస్పష్టం.

మరి మన మాశించుచున్న దుఃఖరహిత జీవితము, శాశ్వత ఆనందం మనకు గగన కుసుమమేనా? ఎన్నటికీ అది సాధ్యం కాదా? అని ప్రశ్నిస్తే, "కర్మ యోగం ద్వారా సాధ్యమే" అని వేద శాస్త్రం మనకు బదులిస్తుంది.



కర్మ అనగా 'పని', 'యోగం' అంటే భావన (దృక్పథం) అని అర్థం.

ప్రతి కర్మను ఈశ్వరుని ఆజ్ఞగా, ఒక పవిత్ర కార్యంలా భావించి ఫలాపేక్ష రహితంగా ఆచరిస్తూ, ఎటువంటి ఫలితమెదురయినప్పటికీ అది ఆ ఈశ్వరుని ప్రసాదంగా స్వీకరించగలగడమే 'కర్మయోగం' అనబడుతుంది.

ఇటువంటి భావనతో చేయు కర్మలే ఎల్లప్పుడూ శ్రేష్ఠం. ఈ భావన లోపించిన పనులు కేవల కర్మలనబడతాయి.

**కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన**
**మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోస్త్వ కర్మణి**
(భ.గీ. 2.47)

**యోగ స్థః కురుకర్మాణి సంగం త్యక్త్వాధనంజయ**
**సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే**
(భ.గీ. 2.48)

పంచ మహాయజ్ఞాచరణే కర్మయోగమని చెప్పవచ్చు.

**పంచమహా యజ్ఞములు :**

1. దైవ యజ్ఞం 2. పిత్రు యజ్ఞం, 3. ఋషి యజ్ఞం
4. మనుష్య యజ్ఞం 5. భూతయజ్ఞం

ఈ ఐదు రకముల కర్మలను పంచమహా యజ్ఞము లుగా పేర్కొంటారు. పంచ మహా యజ్ఞములను ఆచ రించుట ద్వారా గృహ విధులను నిర్వర్తించుటలో మనకు ఎదురగు పంచ సూన పాపములను తొలగించు కొనవచ్చునని ధర్మ శాస్త్రం సూచిస్తున్నది.

**ఖండనం పేషణం చుల్లీ ఉదకుంభశ్చ మార్జనీ**
**పంచసూనాః గృహస్థస్య పంచయజ్ఞా త్ప్రణశ్యతి**

ఖండనం అనగా కాయగూరలు తరుగునపుడు, పిండి మొదలగు పదార్థములను రుబ్బునపుడు, వంట కొరకు నిప్పుని రాజేయునపుడు, గృహమును శుభ్రపరచునపుడు మరియు నీటిపాత్రలను నిల్వ ఉంచు ప్రదేశములలో కొన్ని రకముల జీవరాశులు సంహరించబడుచుంటాయి. ఇది అనివార్యం. అయినప్పటికీ దీని వలన పాపం చుట్టు కుంటుంది. పంచమహా యజ్ఞములను ఆచరించుట ద్వారా ఈ పాపము నుండి విముక్తిని పొందవచ్చు.

**1. దైవ యజ్ఞం**

ఈ సకల చరాచరజగత్తుకి సృష్టికర్త భగవంతుడు. మన మనుగడకు అవసరమయిన గాలి, నీరు, ఆహారం, ఉష్ణం మొదలగు వాటిని ప్రసాదించునది ఆయనే గనుక భక్తితో, కృతజ్ఞతతో అనునిత్యమూ పూజించవలెను.



శాస్త్రంలో చెప్పబడినటువంటి నవవిధ భక్తి మార్గము లలో ఏదో ఒక భక్తిమార్గాన్నెంచుకుని పూజంచాలి.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం**
**అర్చనం వందనం దాస్యం సఖ్యం ఆత్మ నివేదనం**

**2. పితృ యజ్ఞం:**

పితృలోకంలోని పితృదేవతల మూలంగానే మన మీనాడు మాతా పితరుల ద్వారా యీ భూమిపై జన్మించ గలిగాము. అందుచేత పితృదేవతలను తృప్తిపరచుట మన కర్తవ్యం.

శ్రాద్ధ కర్మలు, తర్పణాలు మొదలగునవి ఆచరించ వలెను.

**3. ఋషి యజ్ఞం :**

భగవంతుడి నుండి వెలువడిన వేదశబ్దములను నాటి ఋషి పుంగవులు తమ తపోబలము చేత గ్రహించి వాటిని స్మృతులు, పురాణములు, యితిహాసముల రూపంలో మనకందించారు. కనుక వారిపట్ల కృతజ్ఞతతో, భక్తితో వీటిని ప్రతిరోజు పారాయణం చేయాలి.



**4. మనుష్యయజ్ఞం :**

దీనినే అతిధి యజ్ఞమని కూడ వ్యవహరిస్తారు. తోటి మానవుల పట్ల సమత, మమత, మానవతా భావంతో మన సహాయ సహకారములను అందించగలగాలి. అతిధులను సేవిస్తూ జీవితాన్ని గడపాలి.

"మానవ సేవే మాధవ సేవ" అంటున్నది ధర్మశాస్త్రం.

**5. భూత యజ్ఞం :**

మనతో పాటు భగవంతునిచే సృష్టింపబడిన పశు పక్ష్యాదులు, క్రిమికీటకములపై దయ, కరుణ కలిగి ఆహారం, నీరు మొదలగునవి సమకూర్చుతూ వాటిని ఆదరించాలి.

వృక్ష సంపదను సంరక్షించి వాతావరణ సమతౌల్య తను పరిరక్షించుట చేతనే ఆరోగ్యకరమైన జీవితం మనకు సాధ్యపడుతుంది. ఈ పంచమహాయజ్ఞములను ఆచరించ డమే కర్మయోగము.

**యజ్ఞ శిష్టాశినః సంతః ముచ్యంతే సర్వకిల్బిషైః**
**భుంజతే తే త్వఘం పాపా యే పచంత్యాత్మ కారణాత్**

(భ.గీ. 3:13)

యజ్ఞశిష్టాన్నమును స్వీకరించు శ్రేష్ఠ పురుషులు అన్ని పాపముల నుండి ముక్తులగుదురు. మరియు కర్మల నాచరించునపుడు నాలుగు అంశములను దృష్టిలో ఉంచుకొనవలెను.



1. నేను చేయు కర్మ ఈశ్వరుని ఆజ్ఞ, ఆ భగవంతుని కొరకే నేను చేయుచున్నానను వినమ్ర భావన, దాస్య భావన ఉండాలి.

"ఈశ్వర ప్రీత్యర్థం కర్మ కుర్వంతి" అని సంకల్పం చెప్పడంలో అంతరార్థమిదే.

ఇటువంటి వినమ్ర భావన మనలో ఉన్నప్పుడు కర్మచేయడంలో కష్టనష్టము లెదురయినప్పటికీ వెరవక, ఫలితాన్ని ఆశించక కర్మ చేయగలుగుతాము.

నిజానికి సృష్టిలో ప్రతి కర్మకు ఫలితం మనం ఆశించినా, ఆశించకున్నప్పటికినీ వచ్చి తీరుతుంది.

2. కర్మలను 'యజ్ఞం'లా ఆచరించవలెను.

యజ్ఞమంటే హోమకుండం, ఆహుతి ద్రవ్యాలు, వేద మంత్రోచ్చారణలతో చేయు కర్మలనే కాదు అర్థం, చేసే ప్రతి కర్మను ఒక పవిత్ర కార్యంలా, భగవంతుని కొరకే ఆచరించుచున్నానన్న 'భావన'తో శక్తివంచన లేకుండా, నిస్వార్థంగా ఫలాపేక్షరహితంగా నిర్వర్తించడమే. ఇటువంటి భావనతో చేయు ప్రతి కర్మ యజ్ఞమే అవుతుంది. ఇటువంటి కర్మలు సదా మానవుని పునీతంగావిస్తాయి.

**యజ్ఞార్థాత్ కర్మణోన్యత్ర లోకోయం కర్మబంధనః**
**తదర్థం కర్మ కౌంతేయ ముక్త సంగః సమాచర**

(భ.గీ. 3.9)

3. కర్మలను ధర్మంగా ఆచరించాలి.

"ధర్మోరక్షతి రక్షితః"

ధర్మాన్ని అతిక్రమించక ఆచరించు, ఆ ధర్మమే నిన్ను రక్షిస్తుంది అని శాస్త్రమంటున్నది. మనం చేసే కర్మ ధర్మబద్ధమైనదని ఎలా తెలుస్తుంది?

మనం చేయు కర్మ మనల్ని బంధించకుండా (మనలో) ఎటువంటి పరితాపానికి గురిజేయక, న్యాయబద్ధంగా ఉంటూ పరులకు ఎటువంటి హాని కలిగించక, ప్రయోజనం చేకూర్చుతుంటే అది ధర్మసమ్మతమే.

అందుచేతనే పెద్దలు రామునిలా జీవించమని బోధిస్తుంటారు. కారణం, శ్రీరాముడు ధర్మానికి ప్రతి రూపంలా జీవించి చూపిన ఆదర్శమూర్తి.

ధనమును న్యాయబద్ధంగా, అవసరములమేరకు ఆర్జించడంలో తప్పులేదని శాస్త్రం అంటున్నది. ఆ శాస్త్రమే ధనాన్ని సద్వినియోగం చేయమని ఉపదేశిస్తున్నది.



**ఆహారార్థం కర్మకుర్యా దజస్రమ్**
**స్యాదాహారః ప్రాణ సంధారణార్థమ్**
**ప్రాణాధార్యాః సత్వజిజ్ఞాసనార్థమ్**
**తత్వం జ్ఞేయం ఏనభూయోనదుఃఖమ్**

సత్కర్మల ద్వారా ధనాన్ని వినియోగిస్తూ పుణ్యాన్ని ఆర్జించు. ఈ పుణ్యమే నిన్ను శ్రేయోమార్గమునకు కొనిపోయి దుఃఖరహిత జీవితాన్ని అనగా మోక్షాన్నే ప్రసాదిస్తుంది.

4. నేను చేయు కర్మ చిత్తశోధకం, ముక్తి సాధకం అన్న భావన కలిగి ఉండాలి.

మనం చేయు కర్మలన్నీ మన అంతరంగ మాలిన్యాన్ని తొలగించి చిత్తశుద్ధిని కలిగిస్తాయి. ఈ చిత్తశుద్ధే జ్ఞానమార్గం వైపు నడిపించి చివరకు మోక్షాన్ని పొందుటకు దోహద పడుతుంది.

ఈ నాలుగు రకముల భావనలతో కర్మల నాచరించుట శ్రేష్ఠం. ఇటువంటి కర్మలలో వేదమే యిమిడియున్నది. కారణం, ప్రతి పనిలో దైవిక అంశను చూసే సంస్కృతి మనది.

ఇటువంటి జీవన విధానం మనకు ఆత్మజ్ఞానమును కలిగించుటకు దోహద పడుతుంది.



కనుక "భావన" అన్నది ప్రధానం. జీవిత మంటేనే భావన. "యద్భావం తద్భవతి" అన్నారు. మన ఆలోచనా సరళి మీదే మన జీవితం ఆధారపడి ఉంటుంది.

గుట్టగా పడి ఉన్న యిటుకలు వాటికవే ఎవరి సాయమూ లేకుండా అందమైన భవంతిలా రూపు దిద్దుకొనగలవా? లేదు. "మేస్త్రీ" వాటిని ఒక క్రమ పద్ధతిలో అమర్చి కావలసిన విధంగా అందంగా నిర్మిస్తాడు.

అదేవిధంగా భగవంతుడిచ్చిన మేధస్సు (బుద్ధి)ను ఉపయోగించి మనలోని ఆలోచనలను క్రమపద్ధతిలో శాస్త్రానికి అనుగుణంగా పొందికగా అమర్చుకుంటూ జీవితాన్నే నందనవనంలా మలచుకోగలగాలి.

నేడు ప్రధానంగా మన మెదుర్కొంటున్న సమస్యలు రెండు. 1. వాతావరణ కాలుష్యం, 2. మానసిక ఒత్తిడి.

ఏమిటి దీనికి కారణం అని తరచి చూస్తే మన జీవన విధానం శాస్త్రానికనుగుణంగా లేకపోవడమే.

చేసే కర్మలలో భగవచ్చింతన మృగ్యం. యజ్ఞభావన శూన్యం. ధర్మాచరణ పూజ్యం.

అదే మన పెద్దల జీవన సరళిని ఒక్కసారి గమ నించండి. ఎంతో ప్రశాంతత, ఆనందం, తృప్తి వారి



జీవితాలలో తొణికిసలాడుచుండేవి. కారణం, అంత రంగంలో యజ్ఞ భావన నిండి ఉండడమే, ప్రతి కర్మను భగ వంతుని పట్ల భక్తి భావనను యిముడ్చుకుని ఆచరించడమే.

నిద్ర లేవగానే భూమిపై పాదం మోపడానికి ముందే

**సముద్రవసనే దేవి పర్వత స్తనమండలే**
**విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే**

అంటూ భూమాతను వేడుకొనేవారు.

దంతధావనానికై అవసరమయిన పుల్లను కోయుటకు ముందు ఆ వృక్షాన్ని అనుమతి కొరకు

**ఆయుర్బలం యశోవర్చః ప్రజాం పశు వసూనిచ**
**బ్రహ్మజ్ఞానాంచ మేధాంచ శన్నోదేహి వనస్పతే**

అని ప్రార్థించేవారు. స్నానం చేయునపుడు

**గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతీ**
**నర్మదేసింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు**

అంటూ కృతజ్ఞతతో జలదేవతను స్మరించుకొనేవారు.

స్నానానంతరం సూర్యభగవానునికి భక్తితో నమ స్కరించుకొనేవారు.

భోజనవేళలో

**అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాందేహ మాశ్రితః**
**ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం**

(భ.గీ. 15:14)

అంటూ ప్రార్థించేవారు. ఇది కేవలం ఉదర పోషణార్థం కొరకే కాదు, 'ప్రాణాగ్ని హోత్రం' అనగా జఠరాగ్ని రూపంలో ఉన్న ఆ అగ్నిదేవతను యీ ఆహారం ద్వారా తృప్తిపరచుచున్నాననుభావన.

సంపాదన, బంగారం యిలా క్రొత్తగా ఏది తమకు లభించినప్పటికీ అది ఆ భగవంతునిదే అన్న భావనతో మొదట పూజగదిలో ఉంచిన తర్వాతే ప్రసాదంగా స్వీకరించేవారు

పిల్లలు కూడా ఆయన ప్రసాదమే అన్నట్లు భగవంతుని పేర్లు పెట్టేవారు.

నామకరణం, అన్నప్రాసన, కర్ణ వేదన (చెవులు కుట్టించుట), కేశఖండనం (పుట్టు వెంట్రుకలు తీయించుట), విద్యాభ్యాసం, ఉపనయనం, వివాహం .... ఒకటేమిటి 41 సంస్కారాలలో అగ్రతాంబూలం ఆ భగవంతునిదే!



గృహప్రవేశ సమయంలో కూడా మొదట భగవంతుడిని పూజించిన పిమ్మటే గృహ యజమాని అందులో ప్రవేశిస్తాడు.

ఇటువంటి సనాతన వైదిక ధర్మబద్ధ జీవనమే వారిని సుఖ సంతోషాలతో తృప్తిగా జీవించగలిగేలా చేసినది.

పంచభూతములతో నిర్మితమయిన యీ మానవ దేహం భగవత్ప్రసాదమే. మన మనుగడకు ఆధారమయిన పంచభూతముల పట్ల కృతజ్ఞతా భావన వారి మదిలో తొణికిసలాడుచు వారి జీవన శైలిలో యీ విధంగా వ్యక్తమగుచుండేది.

'కర్మ' అన్న రెండక్షరముల పదం మన జీవితాన్ని ఏ విధంగా శాసిస్తున్నదో గమనించండి.

వాస్తవానికి యీ కర్మలు సృష్టి ఆరంభంలోనే మానవునితో పాటు భగవంతునిచే సృష్టించబడినవి. ఈ కర్మలను యజ్ఞ భావనతో ఆచరించండి అవి కామధేనువులా మిమ్ములను సంరక్షిస్తాయి అని ఆ దైవమే హితవు పలికాడు.

**సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః**
**అనేన ప్రసవిష్యధ్వమ్ ఏషవోస్త్విష్ట కామధుక్**

(భ.గీ. 3:10)



**దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః**
**పరస్పరం భావయంతః శ్రేయః పరమ వాప్స్యథ**

(భ.గీ. 3:11)

ఈ విధముగా దేవతలను తమ కర్మల ద్వారా పూజిస్తూ, తృప్తిపరుస్తూ తద్వారా వారి అనుగ్రహాన్ని పొందుచూ జీవితాన్ని ప్రశాంతంగా, ఆరోగ్యవంతంగా గడుపగలిగారు మన పెద్దలు.

ఆ వృద్ధవ్యవహారమే మనకు శిరోధార్యం కావలెను.

దైవాన్ని కృతజ్ఞతతో స్మరిస్తూ వాతావరణ సమతౌల్యతను కాపాడుకుంటూ శాస్త్రబద్ధంగా జీవించి మన పెద్దలు సుఖజీవనాన్ని సొంతం చేసుకోగలిగారు.

వర్షం, ఉష్ణం మొదలగు వాటిని మన మేధస్సుతో నూతనంగా సృష్టించగలమా? అసాధ్యం.

ప్రకృతిలో ఉన్న ఉష్ణాన్నే సోలార్ ఎనర్జీ పేరుతో భద్రపరచుకొంటున్నాము. మేఘాలలో ఉన్న నీటినే మేఘ మధనమంటూ వర్షాన్ని కురిపించ ప్రయత్నిస్తూ యిదంతా మన మేధోమధనమంటూ మురిసే మనం ఒక్క విషయాన్ని గ్రహించగలగాలి.

మన మేధస్సు ఆ భగవంతుని ప్రసాదమే అని.



ఇది అవగతమయిన నాడు మనలో అప్రయత్నంగానే కృతజ్ఞత పెల్లుబుకుతుంది. యజ్ఞభావన మన కర్మలలో ప్రస్ఫుటమవుతుంది.

ఇదిగ్రహించడం మన కర్తవ్యం. అందుకే ప్రతి ఒక్కరికీ జీవితంలో సంప్రదాయ గురువర్యుల మార్గదర్శనం అత్యంతావశ్యకం.

సంఘజీవులమైన మనం అనునిత్యం ఎందరో వ్యక్తులపై ఆధారపడుచున్నాము. తల్లి, తండ్రి, భార్య, భర్త సోదరులు, స్నేహితులు, పనివారు... మొదలగు వ్యక్తుల సహాయ సహకారములపై మన జీవనం ఆధారపడి ఉన్నది. కనుక వీరిపట్ల బాధ్యతాయుతంగా మెలగడం మనవిధి, కర్తవ్యం.

ఒక భర్త తన భార్య, తల్లిదండ్రులు, కుటుంబం పట్ల తన బాధ్యతనెరిగి విధులనాచరించినట్లయితే, అతని హక్కులు వాటికవే నెరవేర్చబడుతాయి. ప్రతి ఒక్కరూ యిటువంటి బాధ్యతాయుత జీవనాన్ని గడపడం ఉత్తమమని శాస్త్రం హితవు పలుకుచున్నది. ఈ విధమైన జీవనాన్ని గడపని వారు చోరులుగా భావింపబడుతారు.

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః**
**తైర్దత్తాన ప్రదాయైభ్యః యో భుంక్తే స్తేన ఏవ సః**

(భ.గీ. 3:12)

పరుల హితమును కూడా కాంక్షించగలగాలి.

"లోకా సమస్తా సుఖినోభవంతు" అన్న ప్రార్థనలోని అంతరార్థం యిదే.

యజ్ఞకర్మలలో దానం విశిష్టమైనది. దాన గుణం వలన సమాజంలోని అసమానతలు క్రమంగా తొలగి పోవడమే గాక, మనలో తాగ్యగుణం పెరిగి మనకు శ్రేయస్సునిస్తుంది. దానం మనల్ని పునీతులను గావిస్తుంది. బృహదారణ్యకోపనిషత్తులో యీ విధంగా చెప్పబడినది.

**తదేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేనదానేన**
**తపసా అనాశకేన ఏతమేవ విదిత్వా మునిర్భవతి**

(బృ. 4-4-22)

త్యాగమే సర్వసంగ పరిత్యాగానికి దోహదపడుతుంది. ఒక తల్లి ఏ విధంగా తన బిడ్డల యోగక్షేమాలనే సర్వదా కాంక్షిస్తుందో, శాస్త్రమాతకూడా వేయితల్లులకు సమానమై సదా మన హితాన్నే వాంఛిస్తుంది.

'సహస్రహితైషిణీ' వేదమాత



కనుక శాస్త్రాన్ని విశ్వసించాలి. శాస్త్రయుత జీవనాన్ని గడపగలగాలి. శాస్త్ర విహిత కర్మలనాచరిస్తూ, దేవతలను తృప్తిపరుస్తూ జీవనాన్ని సాగించాలి.

వాస్తవానికి 'సృష్టిచక్రం' యీ దేవతల అనుగ్రహంపైనే ఆధారపడియున్నది.

**సృష్టి చక్రం:**

యజ్ఞములలో మనం సమర్పించు ద్రవ్యములను సూర్యభగవానుడు స్వీకరించి సంతుష్టుడై సకాలంలో వర్షమును కురిపిస్తాడు.

**అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్య ముపతిష్ఠతే**
**ఆదిత్యాత్ జాయతే వృష్టిః వృష్టే రన్నం తతః ప్రజాః**

(మనుస్మృతి 3.76)

ఈ వర్షం వలన పంటలు సమృద్ధిగా పండి తద్వారా ఆహారాన్ని మనం పొందుచున్నాము.

స్త్రీ పురుషులు స్వీకరించు యీ ఆహారం నుండి ప్రాణులు ఉద్భవించడం జరుగుచున్నది. ఇదే సృష్టి చక్రం.






ఈ సృష్టి చక్రం సక్రమంగా సాగాలంటే మనం చేసే కర్మలను యజ్ఞభావనతో ఆచరిస్తూ దేవతలను తృప్తి పరచగలగాలి.

**"ఏవంప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః**
**అఘాయురింద్రియా రామో మోఘం పార్థ స జీవతి**

(భ.గీ. 3.16)

ఈ విధంగా పరంపరాగతముగా కొనసాగు యీ సృష్టిచక్రమునకు అనుకూలముగా ప్రవర్తింపక యింద్రియ సుఖలోలురై జీవనాన్ని సాగించువారి జీవితం వ్యర్థము.

సాధారణంగా ప్రతి వ్యక్తి తన స్వభావానికను గుణంగానే కర్మల నాచరిస్తుంటాడు. మన పాప పుణ్యాల సంస్కారమే వాసనారూపంలో మనలో నిగూఢంగా ఉండి స్వభావంగా వ్యక్తమవుతుంది. ఈ విషయమునే శ్రీ భగవత్పాద ఆది శంకరాచార్యుల వారిలా అంటారు.



**ప్రకృతినామ పూర్వజన్మ కృత ధర్మాధర్మాది సంస్కారః**
**వర్తమాన జన్మౌ అభివ్యక్తః**

మానవులు జీవితంలో రెండు విధములుగా ప్రవర్తి స్తుంటారు. ఒక రకంవారు తమ స్వభావము ననుసరించి పరులకు హితమైన, కాకపోయిన, యిష్టాయిష్టాలకు వశు లై ప్రవర్తిస్తుంటారు. దీనినే "స్వాభావిక ప్రవృత్తి" అంటారు.

మరొక రకం వారు తమయిష్టానికి వ్యతిరేకమయి నప్పటికీ అది శాస్త్రయుతమైనచో దానినే ఆచరిస్తారు. దీనినే 'శాస్త్రీయ ప్రవృత్తి' అంటారు. పరులహితమే వీరికి ప్రధానం.

ఉదాహరణకు "ధూమపానం నకుర్యాత్"
ధూమపానం చేయరాదు అంటుంది శాస్త్రం.

స్వాభావిక ప్రవృత్తి గలవారు అది శాస్త్రనిషిద్ధకర్మ అని తెలిసినప్పటికీ యిష్టాయిష్టాలకు లోనయి బలహీనత వలన ఆ కర్మని ఆచరిస్తారు. అయితే శాస్త్రీయ ప్రవృత్తి గలవారు అది తమ యిష్టాయిష్టాలకు వ్యతిరేకమయినప్పటికీ అది శాస్త్రనిషిద్ధం గనుక ఆకర్మని ఆచరించరు.

ప్రతి వ్యక్తి యొక్క యింద్రియ విషయములయిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములలో రాగద్వేషములు దాగి ఉండి కర్మలపైపు ప్రేరేపిస్తుంటాయి.

**ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ**
**తయోర్న వశమాగచ్ఛేత్ తౌహ్యస్య పరిపంథినౌ**

(భ.గీ. 3:34)

ఈ కారణం చేతనే మనం అనుక్షణం ఏదో ఒక కర్మను చేస్తూనే ఉంటాము. కర్మ ఆచరించకుండా ఉండడం అసాధ్యం. కాని, ఈ రాగద్వేషములే మానవుని శ్రేయస్సుకు విఘ్నకారకములు, మహాశత్రువులు. కనుక రాగద్వేషాల కతీతంగా కర్మలనాచరించడం ఉత్తమం.

ఈ రాగద్వేషములకు కారణం కామం, క్రోధం.

మనలోని కోరికలు తీరనపుడు అవి క్రోధంగా మారి మనలోని విచక్షణాశక్తిని, వివేకాన్ని నశింపజేస్తాయి, రాగద్వేషములకు కారణమవుతాయి.

**కామఏష క్రోధఏష రజోగుణ సముద్భవః**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణం**

(భ.గీ. 3:37)

ఈ కామక్రోధములకు వశం కాకుండా రాగద్వేషాలకు దాసులమై స్వాభావిక ప్రవృత్తితో కాక శాస్త్రీయ ప్రవృత్తితో జీవించడమే ఉత్తమం.

ఈ విధమైన కర్మాచరణమే శ్రేష్ఠం.



యజ్ఞభావనతో చేయు శాస్త్ర విహిత కర్మలలో భగవంతుడే ప్రతిష్ఠితుడై ఉన్నాడు.

అందుకే మనం దేవాలయాలలో పూజలు, యాగాలు, ధర్మకార్యాలను ఆచరిస్తున్నాము.

వేదం పరంపరాప్రాప్తం. సనాతన ధర్మం.

ఎక్కడో పుస్తక పుటలలో నిక్షిప్తమైలేదు.

భగవచ్చింతన నిండిన హృదయంలో నిబిడీకృతమై యున్నది. యజ్ఞభావనతో చేయు కర్మలయందు ప్రతి బింబించుచున్నది. శాస్త్రీయ ప్రవృత్తితో ధార్మికంగా జీవించు ధర్మానుష్ఠానపరుల జీవనశైలిలో ప్రస్ఫుటమగుచున్నది.

శాస్త్రములను ఆపోసన పట్టి ఆత్మ జ్ఞానాన్ని పొందిన గురువుల బోధలలో నాదమై ధ్వనించుచున్నది.

**యత్ర యత్ర యజ్ఞః తత్ర తత్ర వేదః**
**యత్ర యత్ర వేదః తత్ర తత్ర యజ్ఞః**

ఇటువంటి జీవన విధానమే మనహిందూ ధర్మం. ఇదే మన సంస్కృతి. భారతదేశం యిటువంటి సంస్కృతికి పుట్టినిల్లు. వేద పరిరక్షక దేశం. వేద భాండాగారం.



యిటువంటి ఘనత వహించిన సంస్కృతిలో పుట్టిన మనం ఆ విలువనెరిగి శాస్త్రయుతంగా జీవిస్తూ సర్వ మానవాళికి ఆదర్శ ప్రాయులం కావాలి. మన పిల్లలను మరోతరానికి యీ సంస్కృతిని పదిలంగా చేరవేయగల వేద పరిరక్షకులుగా మలచగలగాలి. ఇది మన కర్తవ్యం.

"శరీరమాద్యం ఖలుధర్మసాధనం"

మోక్షసాధన కొరకే యీ మానవ దేహం, మానవ జన్మ అనిగ్రహించవలెను.

మన చుట్టూ ఉన్న బంధాలు, బాంధవ్యాలు, పరిసరాలు, పరిస్థితులు ఎటువంటి వయినప్పటికీ అవి "ఈశ్వర సృష్టి" అన్న భావన కలిగి కర్మలను భగవంతుని ఆజ్ఞగా భావించి ధర్మయుతంగా ఆచరించాలి. నేను నిమిత్త మాత్రుడను అను కర్తృత్వరహిత భావనతో పనులు చేయాలి. ఫలాపేక్షరహితంగా (భోక్తృత్వ భావన లేకుండా) కర్మలను ఆచరించగలగాలి. నేను, నాది అన్న భావన లేక మమకార రహితంగా కర్మలను నిర్వర్తించాలి. సుఖదుఃఖాల పట్ల, మానావమానముల పట్ల సమత్వం కలిగి ఉండాలి.

**మయి సర్వాణికర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా**
**నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః**

(భ.గీ. 3.30)



ఈ విధంగా కర్మలనాచరించగలగాలి. దీనికి ఎంతో మానసిక పరిపక్వత, దృఢసంకల్పం అవసరం.

సజ్జనసాంగత్యం, సద్గ్రంథ పఠనం, శాస్త్రయుత జీవన విధానం అలవరచుకోగలగాలి. ఇవి లేనినాడు కర్మలు మనల్ని బంధిస్తాయి. సంసార భవరోగానికి గురి చేస్తాయి.

ప్రతి కర్మని కర్మయోగంగా మలచినచో అది చిత్తశు ద్ధిని ఫలంగా ఇచ్చి మోక్షమార్గగామియై జనన మరణ చక్రభ్రమణం నుండి విముక్తులను చేస్తుంది.

జీవన్ముక్తిని ప్రసాదించి మన జన్మను చరితార్థం చేస్తుంది.

ఇదే కర్మయోగంలోని మర్మము.

ఇది ఆచరించిన వారికిమోక్షం కరతలామలకం.

"ఓం తత్ సత్"

# కర్మయోగము




స్వామిని సత్యవ్రతానంద సరస్వతి

ఆధ్యాత్మిక జీవనమే ఆరోగ్య సూత్రము
వైదిక మార్గమే జీవన మంత్రము
శాస్త్ర శ్రవణమే జ్ఞాన నేత్రము

*ప్రచురణ, ప్రతులకు :*
**అక్షర విద్యా ట్రస్ట్**
New No.15, (Old No.7/1)
మహాలక్ష్మి వీధి,
టి.నగర్, చెన్నై-600 017.
ఫోన్ : 044-24328087
Website : www.swaminisatyavratananda.org